# భగవాన్

# శ్రీ సత్యసాయి సందేశం

శ్రీకరంబగు సౌభాగ్య రీతి దోప
రాగద్వేషాలు జనతిలో ఆగి చవగ
ఆత్మవిజ్ఞాన మందించ నవతరించె
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

విశ్వమొక్కటె వానికి విభుడు నొకడె
చిత్తమందున నేరూపు హత్తుకొనునొ
మొ్రొక్కలిడనదె నీకిదు ముక్తి ననిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ఆత్మ వికసన దీక్ష ఆదియె మతము
తత్వ చింతన అందుకు తగిన ఫలము
జ్ఞానఫలసిద్ధి వడయుటె ధ్యానమనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

అవని అభ్యాస కలిమి వైరాగ్య బలిమి
వన్నె తెచ్చియు నరునకి ఉన్నతినిడు
ముక్తినందగ నాకందు మూలమనెడి
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

సుహిసనిగల పరిలోభాలకు మనసులొంగ
తుచ్ఛ దేహ సుఖాలలో తూలవద్దు
స్వచ్ఛమగు ఆత్మరూపాన్ని మెచ్చుడనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

# సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ఆశ వ్యామోహ రీతులు యదిమి పట్ట
ఈర్ష్య ద్వేషాలలో బడి ఈసులాడి
బ్రతుకు జీవులు ముక్తిని బడయరనెడి
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

సౌఖ్యమున కాది మనసట సరగజూడు
వస్తువులనుండి కలుగుట వట్టి భ్రాంతి
అన్తరము నిత్య సుఖమిచ్చు టన్నృతమనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

శుష్కవాదన నరునికి చురకనిడును
సంశయాత్ముడు భువిలోన సన్నగిలును
నమ్మకము లేని వ్యక్తిగా బ్రహ్మయనెడి
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

కాలుదువ్విన కవ్వింపు కానబడిన
ఉన్నతుడు వారినెదిరించ నుఱకబోడు
జ్ఞాని యజ్ఞానివలె పగబూనడనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

కష్టములు గల్గ నించుక కలతపడక
సుఖములందెడి ఆశకు దఖలుపడక
శాంతిగొనువాడె మిగుల వేదాంతియనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

# సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

చర్మ చక్షువు గనలేదు మర్మగతిని
జ్ఞాన చక్షువు వీక్షించు జాగృతినిల
దివ్యునిఁగాంచ జ్ఞానమె దివ్వెయనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

శోక మోహాలే బీజాలు లోకమందు
ప్రాణి నిలపట్టి బాధించు ప్రాణసఖులు
రాగద్వేషాలే అందుకు రాపిడనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

తూలనాడుట హేళన తుచ్ఛగుణము
దైవశక్తిని తెగడు యధర్మ గుణము
దేహమెన్నడు తెలియదు దేహిననిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

కాశి రామేశ్వరాలలో కాలు నిడిన
పూరి తిరుపతి యాత్రకు కోరిచనిన
ధర్మ రహితునికి పాపరాల్ దక్కవనెడి
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

పుణ్యపురుషుల దర్శించి పుడమిలోన
పుణ్యక్షేత్రాల పాడగని పూజలనిడు
జన్మతరియించు అందుకు జంకకనిక
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

# సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ఇలను సంసార సాగరం ఈదలేక
కపట సన్యాసిగా మారి విఫలతెందక
కర్మ సన్యాసిగాంచుము శాంతినొసగిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

మనిషి కర్తవ్యమును మరచి మసలరాదు
నీతిరీతుల విడనాడి నిందవలదు
సత్ప్రవర్తన చేపట్టి సాగమనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

జాతివర్గాల వర్ణాల కూలదొట్టి
అరుగగా రాదు ముక్తిలనందగాను
సాధన చతుష్టయ బెంతో సాధనమును
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

మనసు దేవునిగొల్వగ మరలకుండ
రాసిలిడి పూజలర్పించ రాదుఫలము
సత్క్రియల పూలునందించ సాగమనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

జైనబౌద్ధ జొరాష్ట్రియన్ జనులుమెచ్చ
హిందు ముస్లిమ క్రైస్తవుల్ అందరుగన
సకల విశ్వాస సంపుటి సర్వమనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

సకల మాతములు పురుషార్థసాధనాల
నవనికందించు యపురూప సాధనాలు
ప్రేమ త్యాగాలకవి రూపు తెలియుమనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ఆత్మదృష్టితో భువినెల్ల నరసినపుడు
సృష్టికంతకు నొకసూక్తి చూడగలవు
భేదభావమె నీకిడు ఖేదమనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ఎవరికే పేరు నచ్చిన ఎదను దలచి
పిలుచుకొనినను దైవము అలుకగొనడు
అందరికి దైవమెల్లరు అందుడనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

భక్తినిడకను నీకెట్లు రక్తిగలుగు
రక్తినందక నేరీతి శక్తివచ్చు
శక్తి లేకను కలుగదు ముక్తియనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

స్వీయ శక్తితో జీవించు స్వేచ్ఛఅదియె
పరులపైబడి బ్రతికిన బానిసయగు
ఆత్మ గౌరవ మొక యలంకారమనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

భక్తి జ్ఞానాల నడుగగ బాగనిత్తు
సర్వరీతుల నేగగ శక్తి నిత్తు
వస్తు భ్రాంతి మనిషికి వద్దు అనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

జ్ఞానవాహిని జనతలో జన్మమెత్త
హెచ్చుతగ్గులు భేదాలు ఏర్పడవు
మానవుడు ఉన్నతుండని ఋరుపకనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ఈర్ష్య ద్వేషాల సంధులో నిదురకొనిన
మనిషి నిందించరాదు మహాత్ములను
మంచినిలజూచి బెదరుము వచనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ఆత్మశక్తుల దేదీప్యతండగాను
దైవశక్తిని తలచుము ధర్మమదియె
కృషినొనర్చక నుడుటకూడదనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

నక్క మొరిగిన రాలునా చుక్కయిలను
వెలుగునొకటీయు కన్నము వెదకునొకటి
కాంతిపొడసూప చీకటి కదలుననిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

## సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ఆత్మ పరమాత్మ భేదాల నవలద్రోసి
అల్పులై తగనిరీతుల నల్లుకొనుచు
విజ్ఞతను బాసి నడచుట అజ్ఞతనెడి
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

సాటిమనిషిని కాపాడ సాగిపొమ్మ
దోపిడే రూపమునను న్న దోసగెసుమ్మ
ఆత్మవంచన మనిషికి అంతమనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

మంచినెల్లను కడు ప్రభోదించి విగుల
నొప్పు తప్పుల వివరించి చెప్పినట్టి
ఉత్తముడు పొందు సద్గతి నుర్విననెడి
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

దేవుడవునీవు సుఖియించెడి బోధిపుమనిన
జీవియెట్టుక పరిణామ రీతిగతియు
కార్య కారణ సంబంధకరణియనెడి
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

లౌకిక జ్ఞానమిదునచె లోకసరణి
అరయ నాధ్యాత్మిక జ్ఞానము పడనిదె
అరుదు ఏవాడు పరమాత్మ నరయడనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

వ్యక్త్యహంకృతి దుర్నీతి వ్యక్తపడిన
ఆత్మజిజ్ఞాస నరునికి అంటదిలను
ఆత్మజ్ఞానమె ముక్తికాధారమనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ఆది అంత్యాల జగతిది బాధపడకు
ఆత్మదృష్టిని గని దీనినధిగమించు
దృశ్యవ్యామోహ జగతిలో దూరకనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

పుట్టుకతో రాగద్వేషాలు పుట్టగలవు
పుడమినవి జ్ఞానరీతిని పూడ్చగలవు
చూడగను దైవార్థనె తోడుఅనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

సత్ప్రవర్తన జ్ఞానము శాంతిపథము
వ్యక్తి ఔన్నత్యమును యెంతో వ్యక్తపరచు
ఆత్మ వికసనకిదియె నాధారమనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

భక్తకోటిలో భక్తిలభాగ ప్రబలి
రక్తిగాన కొన్నివస్తువుల్ శక్తినిడుదు
అంతరార్థము నెరుగరు అల్పులనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

మూఢులెరుగక పరమాత్మ జాడలకును
వక్రరీతిని గల్పింతురు వసుధలోన
పాడుపద్ధతి సాగద వీడమనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ప్రాజలొనరించ భక్తిల పుంజుకొనగ
దైవభక్తియె ముక్తికి దారినిడగ
కోరుకొను దైవరూపాన్ని కొలవమనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

బుద్ధిపరిమిత మది యెంతశుద్ధిగానిన
మనసు మార్గాలలోపడి మసలగలదు
ఆత్మనిల సూక్ష్మరీతి యరయుమనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ధరనతీంద్రియ శక్తులు దర్శనమగు
నాడు నేడును ఒకనాడు కూడవినుము
నీవు కరచని పాడుగను నెట్టకనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ధరను సర్వజ్ఞతను పొందతరముకాదు
మూడుకాలాల రీతుల జూడగలము!
ఆడుకొనగను పరమాత్మ నరయుడనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

జగతికెల్లను అధినేత జన్మదాత
ఒకడె దేవుడు దివ్యాత్మ సకలమతడె
విశ్వమున వేయివిధముల వెలసెననిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

మతములన్నియు జగతిని మనిషికొరకె
జనుల సంఖ్యాకము గనున్న జన్మమొకటె
మనిషిపుట్టుగ జగతిలో మంచిదనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

సర్వశాస్త్రాల నెరిగి గర్వపడుచు
నెగిరి గంతిడ నందులోనేమిగొప్ప
దురభిమానిల భగవాను నరయడనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

తినుటకే నరుడు జీవించు తీరుతప్పు
మనిషి ఆశయ మీశేడ మనుటయొప్పు
సాత్వికాహార మెంతయు సవ్యమనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

మహానుగల దివ్యతను జూచి మత్సరపడి
తెలిసికోలేదు దుర్మతి తెలివిమాలి
జ్ఞానినెరుగని మూర్ఖుడజ్ఞానియనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ధరణి సంసార సంద్రాన్ని దాటిపోవ
భక్తి శ్రద్ధల నావపై పయనమించి
శక్తియుక్తిని కడు వ్యక్తపరచమనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

దేహ భ్రాంతియు నడియాస మోహమిలను
మనిషిలోగల మంచిని మాపు జేయు
మానసిక విగ్రహంబును మరువకనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

వసుధనీవంద గలిగెడి వక్రరీతి
సృష్టిలోలేదు యున్నది దృష్టిలోనె
దృష్టిమారిన శుభమిడు సృష్టియనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

వేదవిజ్ఞానమది యెంతో వెలుగునిడగ
శాస్త్ర విజ్ఞాన రీతిఁ శక్తి నిడును
మేలొసగునివి యెంతయు మేదినికను
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

సత్ప్రవర్తనె మనిషికి సభ్యతనిడు
సహనభావమే వ్యక్తిని చక్కదిద్దు
శాంతమే వాడు కొసగు ప్రశాంతియనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ఇష్టమగుదానిని నెరవేర్చుటేను కలదు
ఇలను సాధించగలేదాని నిష్టపడుతు
తృప్తిపడుమార్గమెంతయు నొప్పాయనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

మనసునందున్న రీతిని మహికిజూపు
లేనిదున్నట్లుగా జూపమానవలయు
ఎవరిమనసున నేముందో ఎరుగుదునను
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

విశ్వభావన నెంతైన విప్పిజెప్ప
నాదు ఆశ్రమ ధ్వజమున నమరినట్టి
ఆరుమతముల చిహ్నాల నరయుమనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ఇహపరాలవి గన్పించు నైక్యతమర
దివ్యమాత్మలు రెండును దరిగనుండు
రెండుపాదాలు నరునికీ రెండు అనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

మనసు దైవానికర్పించి మధురగతిని
భజనసేయగ నీలోని భక్తి పెరగ
గానరసఘుని నీకిదు ధ్యానమనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

నరుడు పశుతుల్యుడై నచో నాశనమగు
మానవత పట్టు మార్గము మహినివదిలి
శివముజూడని వాడిల శవమె అనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ముక్తినొసగెడి మార్గాల శక్తినెరుగుతు
జ్ఞానులకునెల్ల సరియగు జ్ఞానమొసగి
ఇహపరాలకునేమైనా నిత్తుననిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

అద్భుతాలను జూపుచు యవని ప్రజకు
సుకృతినిడు దారిజూపుట సొంపుకాదె
మార్గమిదు దైవమెన్నడు మరువకనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

అధికులముమేము ఇతరులు అధములంటు
మానవత మచ్చపొందెడి మార్గమరసి
తగనిరీతులు సృష్టింప తగదుఅనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

దివ్యతనుపొంది నరులెల్ల నవ్యతగొన
ధరనుగల దర్శనాలెల్ల దారిజూపు
వాద ప్రతివాదముల వేలవేదననిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

అఖిల సిద్ధాంత కర్తలు నాయినరస
ప్రశ్నలిడగను నెంతో ప్రశాంతతగాని
సర్వమతముల సారమే సాయి అనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

సంపదధికారముల నేవి సరిగజూడ
సత్యప్రేమలనుండి సాక్షాత్కరించి
జగతివర్ధిల్లనవియెత్తు జన్మమనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

నాదు సూక్తుల వల్లించ లేదు ఫలము
ఆచరించుము సూక్తి నాత్మార్పణనిడి
నమ్మకముఉన్న సరిపోదు లెమ్మ అనెడి
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

సిద్ధిపొందగ నీవిల సిద్ధపడగ
ముక్తిలభియించు నందుకశక్తదేల
హృదయ దౌర్బల్యతనువీడి కదలమనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

జీవితమ్మౌ సవాలను స్వీకరించి
ప్రేమ మయుని జగతి భావించుమీవు
జీవితపు కేళి నెరిగి క్రీడించుమనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ఆస్తి నాస్తిక రీతిల నాత్మకనుచు
ప్రకృతి దైవము విడదీయ పాడికాదు
జడ చరాలవి రెండును జగతియనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ఎన్ని శాస్త్రాల జదివిన నేమి కనిన
ప్రతిభదీః ప్రజ్ఞలకు నాత్మ పట్టువడదు
అనుభవజ్ఞాన మారాన అందుమనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

మతములో లేదు నిజమని మసలవలదు
గతములో లేదు ఘనతని గంతులిడకు
మతము గతమును మానవ హితములనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

మతము పేరిట కుటిలిత మహిని జరపు
మానవుడు భ్రష్టుడిలగాని మతముకాదు
మతము నరునికి నిడునెంతో మంచిననిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

బోధనామృత మొసగుచు నాదుకొనుట
కుంకుమ విభూతి పటములకోరి పడుట
ఇసుక రేణువు శ్రీకృష్ణ ప్రతిమ అగుట
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

సర్వసంగ పరిత్యాగి సాయి దాల్చు
ఎర్రనికాంతి ఎంతేని వెలుగునిచ్చు
అంగి ఆధ్యాత్మికాధిక్యతందుకొనగ
సాయిరాం దివ్యుడనుటకు సాక్షిగాదె

విశ్వసిద్ధికతీతమహా నొకవిధముదెల్ప
వస్తురాశిని తెప్పించి వసుధకిడుట
హస్తస్పర్శతో రోగాలు యంతమగుట
సాయిరాం దివ్యుడనుటకు సాక్షిగాదె

పుట్టపర్తిలోగల నొకచెట్టునుండి
కోరిన రకాల పండ్లను కోరనిడిన
కల్పతరువును భక్తులు గాంచిరంట
సాయిరాం దివ్యుడనుటకు సాక్షిగాదె

తత్వవేత్తలు కవులు శాస్త్రజ్ఞులెల్ల
కర్షకులు నుపాధ్యాయులు కార్మికులును
నాయకోద్యోగ బృందాలు సాయినరయ
సాయిరాం దివ్యుడనుటకు సాక్షిగాదె

పుణ్యపురుషుని దర్శించ పుట్టపర్తి
జేరి భక్తులు భక్తితో కోరికొలవ
బోధనామృతమందించి యాదుకొనెడి
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

జీవపరిణామ రీతిని జీవికనగ
సుఖపరిత్యాగ భావము దఖలుపడగ
బూది బుధవారమనుచు విభూతి నిడును
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

నిర్మలప్రేమ తనలోన నిలచిజూచు
సత్య సద్ధర్మగుణుడు ప్రశాంతమూర్తి
ధర్మ రక్షకుడీధరా ధర్మమూర్తి
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

రమ్య గుణుడును ధర్మసారథి యితండు
హృదికి బుద్ధికి నడచు వారధియితండు
పరమ హిత బోధకుడు పరమాత్మ యితడు
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

సత్య సౌజన్య సౌందర్య శక్తి ప్రేమ
ఎచట గన నుద్భవించునో ఎరుకపడదు
సాయిరాం వీటికెల్లను సాక్షిగనుము
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

విశ్వదేశికుడై సాయి వెలుగునిడుతు
బుద్ధి బలమిచ్చి జనతను యుద్ధరించ
మధుర బోధలిడెడి మహాత్ముడతడు
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

విశ్వరీతి కతీతమౌ వెలుగునుండి
వెలువడిన కిరణమిౌ భువి నిలువరించె
విశ్వస్థితి కతీతుడు విను వేలుపతడు
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ఘోరసంసార బంధాన్ని భారమంటు
విడచి దేశాల వెడలుట వీడమంటు
తెలియజెప్పెడి సద్ధర్మ తేజమౌతడు
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

భోగరాగాలలో దూరి వీగిపోయి
సాగిరాలేని జనతకు సౌఖ్యమొసగ
వేదమతమున కెంతయు వెలుగునిడిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

మానవాళికి మధుర బోధామృతమిడి
మత్తువదలించి మంచిని మహికిదెచ్చి
మానవుక శాంతి నిచ్చు తపస్వియతడు
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

మానసికమైన వైరాగ్య మార్గమరసి
మనిషి భువిలోన మసలుట మంచిదనుచు
జనతకెల్లను బోధించు ఘనుడతండు
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

సచ్చరిత్ర సదానంద సత్యమూర్తి
ధ్యానవాహిని పరమ విజ్ఞానజ్యోతి
నిత్య సత్య స్వరూపియు నిర్మలుండు
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ధరను ఆధ్యాత్మికపు దృష్టిదర్శనమున
భౌతికపు దృష్టి నెల్లెడ పారద్రోలి
క్షితిని బ్రోచియు మిగుల సద్గతిని యిచ్చెడి
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

శాంతి సత్యాలకిల సాయి సాక్షిగాదె
ప్రేమ ధర్మాలకిల సాయి పేరుగాంచె
పట్టపర్తిలో ధర బ్రోవ పుట్టెనతడు
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

జ్ఞానమార్గము జనులంది జగతి మెలగ
కర్మమార్గము అందుకు కాంతినిడును
కర్మ కుకర్మము తెలుపుచు కాంతినిడెడి
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ఉర్వి త్రికరణశుద్ధిగా నుండమనుచు
ప్రతి మతము కోరు జనులకు ప్రగతినిడగ
సాటి మనిషికి చేయూతె సాయి మతము
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

మనిషిలోగల మత్తును మాపుకొరకై
గొప్ప మహిమలు, కావవి మెప్పుకొరకు
భక్తి విశ్వాసరీతికి శక్తినొసగు
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ఏది నీశక్తి జూపుమా ఎరుకపడక
ననుచు పరమాత్మ పట్టుగ పరుగులిడిన
నరుని దుర్నీతికెంతయు నవ్వుకొనిన
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

లేని రీతిని గారడీపూని చూపు
ఉన్న సత్యాన్ని దివ్యాత్మ ఉద్ధరించు
గారడియు లీల నొకటిగ గనుట తప్పు
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ఎల్లరకు తృప్తి ఆనందమివ్వగలడు
సత్య సౌందర్యరూప సద్ధర్మపరుడు
నరులు ముక్తిని పొందగ వరమొయుతడు
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

శాంతి ధర్మము ప్రేమయు సత్యరీతి
సర్వమతముల కీతని సాటిచెప్పి
సవ్యమార్గాన బోధించు దివ్యుడతడు
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

## సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

కోరికలగూడు నందున కూలవిడుచు
మనసు ముక్తినిగోరదు మహిని నిజము
బుద్ధి వికసించ మనకెల్ల బోధనలిడు
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

శాంతి తనరూపమన్న ప్రశాంతమూర్తి
సత్యరీతిని వెలిబుచ్చు సత్యమూర్తి
ధర్మస్థాపన తనదను ధర్మమూర్తి
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ఎట్లు ఈజీవి ఉన్నదో ఎరుకపడును
ఎందుకీపుడమి అన్నది ఎరుకపడదు
తత్త్వజ్ఞానమె వ్యక్తికి తరగని గని
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

అరయ నారాధనను గాని ఆత్మనెరిగి
హృదయ సీమల మెలగు దివ్యాత్ముడు
మానవుని యంతరంగాన మసలగలడు
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

అద్భుతాలను జూపుట యవని ప్రజకు
అజ్ఞతను బాప దైవత్వ మందుకొరకె
భక్తజన రక్షకుడు సాయి శక్తపరుడు
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

1

తర్క విశ్వాసములనేవి ధరణిలోన
మనిషికిని మంచినిడగను మనగవలయు
ప్రేమవాదమె జగతికి పెన్నిధియను
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

సిరులు వెలసిన రాయలసీమలోన
పుట్టపర్తి ది ఆంధ్రిలో పుణ్యభూమి
భక్తి వాహిని పొంగిడ శక్తి నిచ్చు
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

ద్వంద్వ జగతికతీతుడై ధరణిమెలగి
జ్ఞానవాహినిలో నరుడు స్నానమాడ
మలిన మనసును గానిపోవు మానుడతడు
సకల సౌఖ్య ప్రదాయి శ్రీ సత్యసాయి

సమాప్తం

13 - భగవాన్ శ్రీ సత్యసాయి సందేశం అను గ్రంధమును వెలుగు లోనికి తెచ్చుటకు సహకరించిన శ్రీ సాయి భక్తబృందము సర్వశ్రీ జి ప్రసాదరావు వి సూర్యారావు ఎ వెంకటేశ్వర్లు కె అప్పలరాజు, యస్ సీతారామయ్య వై యస్ ప్రకాశరావు